# శ్రీగిరి మల్లికార్జున శతకము

కృతికర్త :
విద్వాన్ **పింజల సోమశేఖరరావు,**
రిటైర్డు తెలుగు పండితుడు
బి. బి. హెచ్. జూనియర్ కాలేజి, వేటపాలెము.

ముద్రణ :
లిబర్టి ప్రింటర్స్ - చీరాల.

1985 మూల్యము రు. 2-00

# -: సంస్మృతి :-

స్వస్తిశ్రీ చాంద్రమాన తారణనామ సం॥ ఫాల్గుణ బ॥ ౩ లు
శుక్రవారము ది 2-3-1945 న

## గుత్తి సుబ్బనాగమ్మగారు

(కీ॥ శే॥ కోటినాగయ్యగారి ధర్మపత్ని)

మహాశివరాత్రి పర్వదినమున శ్రీశైలము పోయి శ్రీ భ్రమరాంబికా మల్లికార్జునస్వామి సందర్శనం చేసుకొనికి మహానంది మున్నగు పుణ్యస్థలములను సేవించుకొని తిరిగి వచ్చుచు మార్గ మధ్యమున అస్వస్థతకు లోనై పరమపదించినారు ఆ దివ్యస్మృతిని పురస్కరించుకొని ఆమె పౌత్రులు, చిరంజీవులు

## శ్రీ నాగేశ్వరరావు, ధనరాజారావులు

(కీ॥ శే॥ వేంకటేశ్వరరావుగారి కుమారులు)

తమ నాయనమ్మ స్మృత్యంకముగా ఈ మల్లికార్జున శతక ప్రచురణకు ధనసహాయ మొనర్చిరి. వారి ఆస్తిక్యతా నిర్వహణకు సంతసించి ఆయురారోగ్యైశ్వర్యములతో బాటు వారి, వంశాభివృద్ధి ననుగ్రహింప వలయునని కొండ మల్లన్నకు నా విన్నపములు -

ఇట్లు,
కృతికర్త

# శ్రీగిరి మల్లికార్జున శతకము

శ్రీ భ్రమరాంబికా హృదయ చిత్రిత మోహన పుం స్వరూప ! లీ
లా భ్రుకుటీ నియోగిత పురందర ముఖ్య సమస్త లోక పా !
అభ్రశిఖావతంసిత హిమాంశు కళాకలితోత్తమాంగ ! పా
పాభ్రమహాప్రభంజన ! నిరంజన ! శ్రీగిరి మల్లికార్జునా !

జయ జయ శ్రీమదాంధ్ర సువిశాల జగజ్జనతా సమావృతా !
జయ జయ శాత కుంభ కలశ ప్రతిభాసిత గోపురోన్నతా !
జయ జయ దీర్ఘకుడ్య పరిసర్పిత సుందర మందిరాన్వితా !
జయ జయ వ్యోమచుంబిత వృషధ్వజ ! శ్రీగిరి మల్లికార్జునా !

ధూర్జటి ! ద్యోధునీ ఘటిత ధూమ్ర జటాస్ఫుట మౌళిభాగ ! వి
స్ఫూర్జిత ఫాలభాగ పరిశోభిత దివ్య చిదగ్నికుండికా ?
నిర్జరకోటి మస్తక మణీమకుటాంచిత పాదపీఠికా !
దుర్జన దూర ! భక్త పరితోషక ! శ్రీగిరి మల్లికార్జునా !

శరణు మహేశ్వరా ! శరణు సర్వ జగత్పరిపాలనాధురం
ధర ! శితికంధరా ! శరణు త్వచ్చరణైక సమాశ్రయుండనై
శరణముగోరినాడ భవసాగర సంతరణంబుచూపవే
అరమరసేయఁబోక, శరణార్థిని శ్రీగిరి మల్లికార్జునా !

స్వామి ! పరాకు దేవముని సన్నుతనామ ! పరాకు శేముషీ
ధామ ! పరాకు సద్గుణ నిధాన ! పరాకు మదీయ సాహితీ
శ్రీ మహిమానుభూతి సువిశేషముతో శతకంబు నీకిడన్
నేమది నూలుకొంటి కరుణింపవె ! శ్రీగిరి మల్లికార్జునా !

శతకము లాంధ్రసాహితిని చక్కనిప్రక్రియలౌచు నిష్టదై
వతము గుటించి తాఁగ విపన్నమతిం దన యాత్మవేదనా
శతకముల న్ని వేదనము సల్పికొనంపగియుండె నీకిదే
శతకము విన్నపంబుగను సల్పెద శ్రీగిరి మల్లికార్టునా !

ఈ శతకంబులెన్నొ రచియించితి మున్ను పురీశుడైన వి
శ్వేశునిపైన శ్రీ తిరుపతీశునిపైన గణేశుపైన న
ర్వేశునిపైన దేవలమునీశునిపైన రమేశుపైన మ
త్రేశ ! రచింతు నీపయిన నిప్పుడు శ్రీగిరి మల్లికార్జునా !

ప్రథితుడు మున్ను పాల్కురికి పల్కె వృషాధిపుపై యథావచః
ప్రథగల భక్తుడన్నమయ పల్కెను ధూర్జటి ముఖ్యులౌ కవి
ప్రథములు పల్కి రీశతక ఫక్కిఁగృతుల్ కృతకృత్యులమ్మహా
బుధజన వంద్యులం దలప బోలదె ! శ్రీగిరి మల్లికార్జునా !

చేలముల్లై సమేలమును జెంది రహించెడు నంచునేమొ ? శా
ర్దూలమదేభ వృత్తములతో శతకంబులు శైవ సత్కవుల్
చాల రచించి, రేనటులు నల్పియు ఉత్పల చంపకంబులం
బూలుగఁజేయఁబూనితిని పూజలు శ్రీగిరి మల్లికార్జునా !

అర్చననీకొనర్తురు మహాశివభక్తులు భక్తి బిల్వప
త్రార్చనలొప్ప నేనటుల నర్చన లేమొనరింతు నయ్య ! యీ
కూర్చెడు మాటయెన్మిదివిగో ! కవితోత్పల చంపకంబులే
యర్చన గాగ్రహింపుము ! సురార్చిత ! శ్రీగిరి మల్లికార్జునా !

పాయక చంద్రగుప్త నరపాలతనూభవ సుల్లెపూలతో
జేయగఁబూజలందనివిసెంది వరంబుల నిడ్డ సామి, వే
నీయెడఁజంపకోత్పలము లేర్పడగూర్చెడు నాదు పూజతో
నీయుదువేమి నాకు వరమీశ్వర ! శ్రీగిరి మల్లికార్జునా !

నిన్ను సహస్ర పద్మముల నేమము తోడను బూజసేయుచో
వెన్నుడు వేయియందొకడు వెల్తిగనై నిజనేత్ర పద్మముం
గ్రన్నన దీసి పూజయిడగా సురవైరుల ద్రుంపఁజక్రమీ
వెన్నికచేసి యిచ్చితిగదే ! భళి ! శ్రీగిరి మల్లికార్జునా !

కేశవ పూజితా ! గగన కేశ ! భవన్మహిమల్వచింప వా
ణీశఫణీశులేని తగ నేనన నెంత ? మదీయ సాహితీ
కౌశల మెంత ? నా కొలది గానక కావ్యయశంబులందగా
నాశలుపొందినాడను మహాప్రభు ! శ్రీగిరి మల్లికార్జునా !

కమ్మనికైతనిచ్చితివి కారుణికోత్తమ ! నాదు నియ్య దృ
ష్టమ్మున కెంతొ పొంగుచును జానుతెనుంగున నీకు వృత్త బం
ధమ్ములుగూర్చి పాడుదును తప్పక నాకొనగూర్పు ముక్తిమా
ర్గమ్ములు కర్మబంధనహరమ్ములు, శ్రీగిరి మల్లికార్జునా !

కబ్బము లవ్వియివ్వియని కైకొనిలేఖిని వ్రాసికొంట గా
కొబ్బిడి నాగధ్యానమని యోగమటంచని యెన్నడైననే
నబ్బన మేమిచేసితిఁ బరార్థిగ; నీ కవితానుయోగమం
దబ్బగఁజేయు నాకుఁబరమార్థము, శ్రీగిరి మల్లికార్జునా !

ఎన్ని భవంబులెత్తితినొ? ఏ భవమందునఁజేసికొన్న యా
పున్నియమో ? నరత్వమును బొందితి నందితి దెన్గుబాసలోఁ
బ్రన్ననికైత తెన్నులను పన్నుగ నాకొనగూర్పు దీనన
చ్ఛిన్నర సైక్యతా సుఖవిశేషము, శ్రీగిరి మ్లకార్జునా !

బిరుదులు హొందఁగాదు సిరిపెంపు వహింపనదేమిగాదు కై
సరుడయినాడ నీకృతులు సల్పుకొనంగనె వద్దువద్దురా
బిరుదు ల వేటికిం దురదపెట్టు ధనంబు మదంబుపెట్టు శ్రీ
పరమపదంబె నిన్నడుగు వాడను శ్రీగిరి మల్లికార్జునా !

ఈశ ! సురేశ ముఖ్యదిగధీశ శిరో మకుటాగ్రరత్న శో
భా శబలీకృతాంఘ్రియుగ ! భవ్యమదీయ కవిత్వ భావనా
వేశములోన మైమఱచి విశ్వమయు న్నిను బాడుకొందు నా
యాశయ సిద్ధి గూర్పవె మహాశయ ! శ్రీగిరి మల్లికార్జునా ?

శ్రితజన పారిజాత ! పరిశిష్టము లేమియు నేలనయ్య ! నీ
నుతులొనరించెదం గృతులునుంబొనరించెద నమ్రతన్నమ
స్కృతులు ఘటించెదం గరుణయింపెసలారెడి చూడ్కిఁజూచి శా
శ్వత పద సిద్ధికిన్ వెరవొసంగవె ! శ్రీగిరి మల్లికార్జునా !

అందకుఁజేరదీసి అఖిలాండ కరండ పిచండిలంబుగా
నిండిన నీదు రూపమును నేఁగనులారగఁజూడఁజేయవే !
కొండొకడేమి నిన్నడుగఁ గూడదు తీరదనంగఁబోకువే !
ఖండశశాంక మౌళి ! త్రిజగన్నుత ! శ్రీగిరిమల్లికార్జునా !

ఆదికి నాదియైన పరమాత్మునిగా నిను బేరుకొందు, వే
దాది సమస్త వాఙ్మయ మహాభినుతున్నిను సన్నుతింతు, స్వ
ర్గాది జగత్త్రయీశు నిను నాశ్రయముంబొనరింతు నెంతు బ్ర
హ్మాది సురార్చితు న్నిను మహాప్రభు ! శ్రీగిరి మల్లికార్జునా !

ఎవ్వడు దృశ్యమానమగు నీ జగమంతకు మూలకారణం
డెవ్వని వల్ల బుట్టి ? మఱి యెవ్వనివల్లను బెంపగున్ ? లయం
బెవ్వనివల్లనౌను ? పరమేశ్వరునాతని నాశ్రయింతు ని
న్నెవ్విధి నమ్మి బ్రోచెదవొ ? ఈశ్వర ! శ్రీగిరి మల్లికార్జునా !

ఓప్రభు ! నీ ప్రభావ కలితోజ్జ్వలమైన మహాజగత్తులో
విప్రతిపన్నమైనయది వేఱగుపింపదు నింగి నేల వి
శ్వప్రచుర ప్రదేశముల బాహిరమందున నంతరంబునన్
నీప్రభయేగదయ్య ! గమనించిన శ్రీగిరి మల్లికార్జునా !

ఎన్నని నీదు నామముల నెన్నదు నామము నీది గానిదే
మున్నది ? యేస్వరూపమున నుందువొ ? రూపము నీదిగానిదే
మున్నది ? నామరూపములు నుండిన వాడవు లేనివాడవై
యున్న యనాదిమధ్య విలయుండవు శ్రీగిరి మల్లికార్జునా !

నిను మనసార నమ్ముకొని నీ కథలే చెవులారవించుఁదా
మనిశముఁజేతులార నిను నర్చనసేయుచు నీదు దివ్య మూ
ర్తి గనులారఁగన్గొని తరింతురు జ్ఞానులు యోగులున్ మహా
మును, లటు నాకుఁగూర్పు మహిభూషణ ! శ్రీగిరి మల్లికార్జునా !

పురహర ! నీ పదంబులకు మ్రొక్కుశిరంబు శిరంబు, నిన్ను సం
స్మరణముసేయుమానసము మానస, మర్చననీకుఁజేయు నా
కరముకరంబు, నిన్బొగడుకైతలు కైతలు, నీదుభక్తితోఁ
బరగెడు జన్మ జన్మ, భవభంజన ! శ్రీగిరి మల్లికార్జునా !

సాంబ ! మహోఘ భూమిధరశంబ ! భవచ్చరణంబులే శర
ణ్యంబులటంచు నమ్మితి, మహాదురితంబులు పూర్వపూర్వ జ
న్మంబుల నెన్నికొండలుగ మానకయున్నవొ ? నాకు నీ కృపా
లంబనమిమ్ము వజ్రము తెరల్చెద శ్రీగిరి మల్లికార్జునా !

లింగ ! శివానుషంగ ! లవలేశముగానయినన్ భవత్కృపా
పాంగ రవిచ్ఛవిచ్ఛటలు వర్వగఁజేయుము ! మామకీనదు
స్సంగ దురర్థ దుఃఖ తమనంబులు భంగమునొంది నిర్భరా
భంగ సుఖప్రసంగములు వాటిలు, శ్రీగిరి మల్లికార్జునా !

రుద్ర ! కృపాసముద్ర ! యెడరుంగలిగించెద రెంతయున్ మహో
పద్రవకారు లాఱుగురు పొల్పెడి కామముఖాది శాత్రవుల్
భద్రదమైన నీదు పద భక్తికృపాణమనుగ్రహింపు మా
క్షుద్రులఁబట్టి కుత్తుకలుగోయుదు. శ్రీగిరి మల్లికార్జునా !

దేవ ! మహానుభావ : మునిదేవ గణాభినుత ప్రభావ ! నీ
సేవయజీవనంబుగను జేయుము ! వేరు వరంబు లేమియు
న్నీ విడలేదటంచనను నీకొలువే యొన ంచుచున్ సుఖ
శ్రీవిభవంబు మోక్షమును జెందుదు శ్రీగిరి మల్లికార్జునా !

నమ్మితి నీదుపాద నలినమ్ము లజస్రము నీదు నామమం
త్రమ్ము జపింతు నీకవితలంబొనరింతును. పూర్వకర్మ బం
ధమ్ములు తెంపి జన్మరహితమ్ముగునట్టి విధమ్ము సూపవే !
సమ్మతి శంకరా ! శ్రితవశంకర ! శ్రీగిరి మల్లికార్జునా !

వశపడ కింద్రియావళులు పర్వ్యయుధేచ్ఛగ వాజులట్ల తాఁ
బశువిధి పాడుబుద్ధి యొకపాటిగ లొంగదు నీదుభక్తినిం
గశగ నొసంగు ! తిక్కయడగంగనుజేయుదు నొక్కటొక్కటిం
పశుపతి ! వాక్పతి ప్రముఖ వందిత ! శ్రీగిరి మల్లికార్జునా !

అను ఏదమున్ భవత్పదము లాత్మను బాయక స్నానపానభో
జనశయనాదులందునను సంస్మరియింపుచు నీదుచింతనం
దన దిన చర్యయేనరు డొనర్చును ? మోక్షకవాట పాటనం
బొనరుపఁజాలునాతడు మహోన్నత ? శ్రీగిరి మల్లికార్జునా ;

ఆని తరలబ్ధమైన భవదాశ్రయ మొక్కటియున్న జాలుఁ గా
లుని భయమేలయుండు ? మునులోకమెఱుంగ మృకండమౌనినం
దను యమదుర్మదప్రశమనంబొనరించియు రక్షసేయవే !
సనకసనందనాది ముని సన్నుత ! శ్రీగిరి మల్లికార్జునా !

సంజల రేపు మాపులును సంస్మరియించునెవండు ? నీదు మృ
త్యుంజయ నామ మంత్ర మతడొఁద డకాలపు మృత్యుభీతి; హృ
త్కంజమునందహర్నిశలు ధ్యానము సేయుదు మానకుండ మృ
త్యుంజయమున్, ఘటింపు శుభమో శివ ! శ్రీగిరి మల్లికార్జునా !

ఉరుతర జన్మ దుఃఖ బహుళోద్ధతిఁగుందుచు ముక్తిమార్గముల్
దొరకక దేహధారులు నరుల్ దురపిల్లగనేలనయ్యా ! నీ
చరణములే శరణ్యముగ సన్నుతిచేసిన ముక్తి దక్కదే
మరిది ? జితా సమాంబక ! త్రియంబక ? శ్రీగిరి మల్లికార్జునా !

వేదములం బఠించినను విశ్వసదస్సున నెగ్గి కీర్తి సం
పాదనచేయఁగల్గినను పట్టములంది సమస్త శాస్త్ర వి
ద్యాదయితుండు నాఁ దగినఁదానరుఁడెవ్వడు ముక్తిగాంచెడున్
నీదగు భక్తిలేకిల ? మునిస్తుత ! శ్రీగిరి మల్లికార్జునా !

యజ్ఞ ఫలప్రదుండవగునట్టి నినుఁడెగనాడి దక్షుడ
ట్లజ్ఞత విష్ణుజిష్ణుముఖులౌ సురలందఱఁబిల్చి చేయునే
యజ్ఞమ దెట్లుసాగును ? మహామహులే యగుగాక సుంతనీ
యాజ్ఞకు దప్పి బాగుపడరందును శ్రీగిరిమల్లికార్జునా !

మునుకొని యా హిరణ్యకశిపున్ స్వనఖంబులఁబొట్టజీల్చి యా
తని రుధిరంబుద్రావియును తాలిచి ప్రేవులు లోకభీతి సం
జనకముగాగనార్చునెడ సైంహిక మాహరి ఘోరరూప మీ
వణచితిగాదె ? వీరశరభాకృతి, శ్రీగిరి మల్లికార్జునా !

అంబరవీధికిందరచి హంసగుడౌచువిరించి, ఘోణి రూ
పంబున ద్రివ్వికొంచు బలివాసము దాకను బోయివిష్ణు, లిం
గంబునకున్ మొదల్చివర గానక పోయిరటండ్రు నాదు భా
వంబున నెట్టులందుకొనువాడనొ ? శ్రీగిరి మల్లికార్జునా !

సంగతియేదొ చూతమని జంగముమిండని వేనమూని వే
శ్యాంగనగోరి సింధుకటకాధిపు దిప్పలువెట్టినావు నీ
సంగతి కాతడుంబ్రియ నొసంగిన నావతిభక్త చేతిలో
నం గసుగందువై మెఱసినావటె ! శ్రీగిరి మల్లికార్జునా !

పూలను వేయగా మరుని బూదియొనర్చితి భక్తుడెవ్వడో
రాలను వేయబోంచితివి - రాలని పూలనికాదు భక్తియే
మూలము సూవె ! చూఱగొన భూరిభవత్కరుణావిశేషముల్
శ్రీలలనాధిప ప్రముఖసేవిత ! శ్రీగిరి మల్లికార్జునా !

అడిగిన మాత్రనే గిరిజ కర్ధశరీర మొసంగినావు - భ
క్తుడయిన బాణుడుండు మన గోటకుంగావలియుండినావు - బో
యడతడు తిన్నడిడ్డ పలలాన్నపు టెంగిలి యారగించి నా
వౌటయడ ! నీ కృపార్థిననునోమవె ! శ్రీగిరి మల్లికార్జునా !

అమృతముకోసమై మునుసురాసుర లబ్ధిని ద్రిచ్చు వేళ నం
దమిత భయంకరంబగుచు హాలహలంబు సముద్భవించి లో
కముల దహించు నాయెడరు గన్గొని నీగళసీమయందు వే
యిముడగజేసికొంటిగదవే శివ ! శ్రీగిరి మల్లికార్జునా !

ధర రథమై రథాశ్వములు తన్నిగమంబులునై రథాంగముల్
ఖరకరుడున్ సుధాకరుడు గానయి సారథి బ్రహ్మదేవుడై
హరిశరమై సుమేరువు శరాసనమై వనరాశి తూణమై
పురములు గాల్చినావుగదె మూడిటి, శ్రీగిరి మల్లికార్జునా ।

నందిని పందిజేసి యలనాడు కిరాతుడవౌచు బాండురా
ణ్ణందనుతో బరీక్షకు పెనంగితి వాతని శౌర్యధైర్యముల్
డెందము మెప్పు గూర్పగ గడిందిగఁబాశుపతాస్త్రలాభముం
జెందగజేయవే । శ్రితవ శీకర । శ్రీగిరి మల్లికార్జునా ।

ఎన్నని నీదులీలలను నెన్నుదురా ప్రభు । కేవలాజ్ఞతా
చ్ఛన్న మనస్కుడఁ బరమజాల్ముడ జంచలతా స్వభావుడన్,
అన్నవకైత నీ మహిమలందిన మట్టుకు బాడుకొందు నా
ప్రన్నని యక్షరార్చనములంగొను శ్రీగిరి మల్లికార్జునా ।

భూమి జలంబు నిప్పనిలముం గగనంబును భాస్కరుండునున్
సోముడు సోమయాజియనఁజొప్పడు నీదగుమూర్తులెన్మిదిన్
వేమరు జూచుచుండియును వెఱ్ఱిగ దేవుడు లేడటంచు నుం
బామరులాడుచుంటి నగుబాటగు శ్రీగిరి మల్లికార్జునా ।

విశ్వవసుంధరాతలము విశ్వనభోంగణమంతరంబుగా
ఈశ్వర ! నీవుగాని దొకటేమయియున్నది ? దృశ్యమానమీ
విశ్వము నీవయౌచుగనుపించు టెఱుంగరిదేల ? నాస్తికుల్
నశ్వర శూన్యవాదు, లవినశ్వర ! శ్రీగిరి మల్లికార్జునా !

భూతులు భక్తకోటికిడి బూడిద దాల్తువు రత్నభూషణ
వ్రాతము లాశ్రితాళికిడి పాములుదాల్తువు భర్మహర్మ్యముల్
ప్రీతిగ గొల్చువారికిడి పెట్టితివాసము కొండమీద - స్వా
ర్థేతరమయ్యె నీదు సుఖమీశ్వర । శ్రీగిరి మల్లికార్జునా ।

ఇందుఁడు చందుఁడంచు నరుసెవ్వనినో పొగడంగనేల ? దై
త్యేంద్రుడొ ? ఘోరదుర్విషణీంద్రుడొ కాదగువాడు, బ్రహ్మ వి
ష్ణ్వింద్రనుతున్నినుంబొగడ నీప్సిత సిద్ధులుగల్గుఁ గల్గువా
గింద్రియసిద్ధి కల్గుఁ గృతకృత్యత, శ్రీగిరి మల్లికార్జునా ।

ముది పరువెత్తి వచ్చెడిని మోసముసెందితి నిన్నినాళ్లు నీ
పదముల సేవచేసికొన బాల్పడసైతి శరీర సత్త్వముం
జెదరెను ధైర్యమేదినది చిత్తము నిల్వదు హా ! భయంబునుం
గదిరె నితఃపరంబెఱుగఁగావవె । శ్రీగిరి మల్లికార్జునా !

ఊడుగని యీషణత్రయము లొక్కొకటే యొకదానిమించి యొ
క్కడగుచు వెన్కకుందివియగాఁ బరమార్థపుముందు దారికిం
జెడి యుపసానమం దెడరు చేకుటినప్పుడు స్వాస్థ్యమెద నే
వడువున దక్కు ముక్తిపదభాగ్యము ? శ్రీగిరి మల్లికార్జునా !

అదనగు ప్రాయపుం దినములన్నియు నూఱకవుచ్చిపైచి మే
ని డిటవు తగ్గి పెన్ముదిమిసెక్కొన నీ పదభక్తికిన్ మదిం
గుదిరిక సేయుటెట్లగును ? కొంపలు ముట్టికొనంగ నూయి ది
యఁదలచువాని చందమది వ్యర్థము, శ్రీగిరి మల్లికార్జునా !

ప్రాయపుఁదీయముల్ ముసుగు పాటిడ నేమరుపాటునొంది నేఁ
జేయగనైతి నీ కొలువుఁ జెందగనైతిని ముక్తిసాధనో
పాయపు మేలిబాట లిటు పైకొని వచ్చు జరాభరంబు నం
జేయునదేమి ? నన్నెటుల జేసెదొ ? శ్రీగిరి మల్లికార్జునా !

ఆలని చూలటంచనియు నాసలతోఁబెనవేసికొంచు నా
మేలిమి వంటి ప్రాయమును మిన్నక పుచ్చితి నింతెగాని యే
లీలను గన్నలేదు లవలేశము ముక్తికి నార్జితంబు నా
శీల మిటున్నదేకరణిఁజేసెదొ ? శ్రీగిరి మల్లికార్జునా !

రూక్షకృశానుకీలవలె రుద్ర ! భవత్ప్రణవానుయుక్త పం
చాక్షరి నిర్దహించును మహాగహనంబును బోని పాపముల్
దక్షత నేడుకోటులగు తద్వర మంత్రములందు మిన్న పం
చాక్షరి నాకు నిమ్ము గురువై శివ ! శ్రీగిరి మల్లికార్జునా !

ఒకపరి నీదు నామమది యుల్లము నందు స్మరించినంత పే
రుకొనిన పాపరాసులును రూపఱిపోవును దూదికుప్పక
గ్ని కణము ముట్టికొన్నటుల నీఱగుగర్మలు నిన్స్మరింతునా
గకయిక జన్మకర్మలు పొకారుపు ! శ్రీగిరి మల్లికార్జునా !

శివయను నీదునామమును చింతనచేసెడు నట్టివారికిన్
శివమయమైన జీవిత విశేషము గల్గునటంద్రు నేనటుల్
శివ శివ యంచు నీస్మరణసేయుదు నెప్పుడు నాకుఁగూర్చవే
శివమయ సౌఖ్యజీవన విశేషము, శ్రీగిరి మల్లికార్జునా !

పొడగరికందు మ్రానిఫలముల్ మరుగుజ్జత డందఁగోరు న
ట్లెడపక యోగివర్యులు మునీంద్రులు జ్ఞానులు సత్త్వబోధనల్
పడసెడునట్టి ముక్తిపదభాగ్యము లేనను గోరుచుంటి నే
వడువున నాకుఁగూర్పగలవాడవా ? శ్రీగిరి మల్లికార్జునా !

కొండల మీద నెక్కడనొ కూర్చొనినాడవదేమయా ప్రభూ ।
కొండల రాయు డిల్లటము గోరిన యల్లుడవౌట కొండపై
నుండియు జేదుకొందువటె । యుర్విని భక్తుల, దవ్వుదగ్గరం
చుండదులెమ్ము నీదుకృపయుఁడిన, శ్రీగిరి మల్లికార్జునా !

నా భ్రమగాక యేకరణి నల్లమలల్గమియించి విభ్రమా
దభ్రమహాభ్రమార్గములు తాకెడు చుక్కల పర్వతాలపై
శ్రీభ్రమరీసహాయు నినుజేరగఁజాలుదు ? చేదుకో ప్రభూ !
అభ్రధునీ పరిస్ఫుటజటాంచిత । శ్రీగిరి మల్లికార్జునా !

దవ్వుల నుండి నీశిఖర దర్శనముం బొనరించు కొన్నచో
దవ్వులకేగు ఘోరభవతాపములందురు కర్మపాశముల్
త్రెవ్వునటందు రెన్నడది దేవ । ఘటించెదు ! నాదు నేరముల్
త్రవ్వగబోక జన్మసఫలంబిడు శ్రీగిరి మల్లికార్జునా !

దూరపు టధ్వగశ్రమముతో మెయిచెమ్మట వఱ్ఱుగా, దిదృ
క్షారతి భక్తులాత్రముగఁగాళుల నిండిన ధూళితోడనే
చేరి రసైక్యతాస్థితిని శీర్షము మూర్తిని మోదుకొంద్రటే ।
సారెకు జన్మసార్ధకత చాలది శ్రీగిరి మల్లికార్జునా !

ఎన్ని యుగాలుపోయినవో ? ఎన్ని చరిత్రలు మారిపోయెనో !
పన్నగ నీవట న్నెలవుబట్టి మహాత్ములు భక్తులెందఱో
మున్నటకేగుదెంచి పదముల్ స్పృశియింపగ ధూళినింపి నా
రెన్నడు స్వర్ణగాత్రుడగు దేనట ? శ్రీగిరి మల్లికార్జునా !

నీగుడిగోపురాలుగని నీ ప్రహరీలు ప్రదక్షిణించి యం
దాగత భక్తులందరిసి యాగమతంత్రపు రు దచండికా
యాగవిశేషముద్దెలిసి యందలి జంగమరాణ్మఠంబులం
దాఁగి కృతార్థుడౌ దెపుడయా ప్రభు । శ్రీగిరి మల్లికార్జునా !

అచటి శివాజినిర్మిత మహాభ్రపథ స్పృశి గోపురంబునున్
అచటనె కృష్ణరాయలు వెలార్చిన మంటప మందిరంబులన్,
అచటి యనల్ప శిల్ప మహిమాదు లవన్నియుజూచి యాంధ్రతా
ప్రచురతకంజలింపగగలాడనె ? శ్రీగిరి మల్లికార్జునా !

వెనుపడ శైవధర్మమది విశ్వగురుండగు దేవలుండు కా
శిని నిట శ్రీగిరి న్మరియుఁజెన్నలరారగ హంపి శోణ శం
భునగములందు నిల్పెనట మున్నిలఁబీఠములై దిటిం జరి
త్రినిట ద్వితీయమౌచును విరాజిలు శ్రీగిరి మల్లికార్జునా !

వారటె ! రేవణాది గురుపంచక మంచువచింత్రు నీదు ప్రా
కార సుదీర్ఘకుడ్య పరికల్పిత శాశ్వత శిల్పమూర్తులన్
వారినిచూచి భక్తిదయివారగనెప్టు శిరోభివందనా
చారము నిర్వహించుటకుఁజాలుదు ? శ్రీగిరి మల్లికార్జునా !

అటవిని దాటి చింతలను నయ్యుటవింబలె - కొండ లెక్కి సం
కటములపేరి కొండలటుగా - నదులీది భవాబ్ధియట్ల - చీ
కటిదిగులేదగా నడిమి కంటి వెలుంగయి వెల్గు నిన్ను జూ
చు టెపుడొ ? నాకు, ఖండపరశూ ! శివ ! శ్రీగిరి మల్లికార్జునా !

వేమన వెఱ్ఱిపుచ్చలను వేయగ బంగరు పండెనంట వా
డే మఱి వంగనారిడగనేయవి లింగములయ్యెనంట నా
కా మహిమల్ వినంగ బులకాంకురముల్ జనియించుమేన, నా
వేమనగాథ లచ్చటివి వింతలు శ్రీగిరి మల్లికార్జునా !

కాశిని గాళహస్తి శివకంచిని శ్రీగిరి నిట్టు లెల్లది
గ్దేశములందు బర్వికొను తేజముతో వెలుగొందు నిన్ను వి
శ్వేశ ! భవాబ్ధినిస్తరణమేర్పడగా దరిసించు భాగ్యముల్
లేశము నాకుఁగల్గినఁదరింతును శ్రీగిరి మల్లికార్జునా !

త్రేతను నీదు పూజలొనరించెను రాముడు ద్వాపరమ్మునం
బ్రీతిగఁబాండవేయులొనరించిరి పూజ యుగాంతరాల వి
ఖ్యాతి దిగంత విస్తృతమునైన మహామహిమాఢ్యుడీవు ని
న్నాతత భక్తిఁగొల్వ భవమాఱును, శ్రీగిరి మల్లికార్జునా !

పర్వతలింగ మీవగుఁచుబాటిలి చంద్రవతీ కృతంబునం
బర్విన మల్లికార్చనలు పొందురపర్ణముతోడ సైతి పో
డర్విని మల్లికార్జునుడ వుజ్జ్వలుడౌచు యుగాల నుండియున్
సర్వజగాల నేలుకొను సామివి ! శ్రీగిరి మల్లికార్జునా !

అట బలిసద్మమే యదిగనై ప్రవహించెడు గంగయందు ని
ప్పటికిని జంత్రిగుప్త నరపాలుడు తాఁబడియుండి యున్నవా
డటగదె ! పచ్చబండయయి, యయ్యది కన్గొని యందుగ్రుంకులా
డుటలిక నాకుఁ గూర్తువెపుడో ప్రభు ! శ్రీగిరి మల్లికార్జునా !

ప్రవిమల భారతావనిని బర్వికొనన్ మహిమల్ ప్రభావ వై
భవములు జ్యోతిరంగములు ద్వాదశ లింగములొప్పు, నందు రెఁ
డవదిగ దిగ్దిశాగత జనావళికిన్ భవతారకం బౌన
ర్పవెలయు నీదు మూర్తిని దలంచెద, శ్రీగిరి మల్లికార్జునా !

సత్త్వరజస్తమస్సులను సర్వము కూరుచు పెంచు త్రుంచు నా
తత్త్వము నీవు గాఁదలతు తాత్త్వికవేత్తలు భవ్యసాహితీ
తత్త్వవిదుల్ యధార్థతకు దగ్గరయైన పథంబువట్టి య
స్తిత్వముతోడ నిన్ను దరిసింతురు శ్రీగిరి మల్లికార్జునా !

నాదు మనం బదొక్క విపినంబుగనున్నది స్వైరవృత్తి గా
మాదులు క్రూరసత్వములెయయ్యి విహారమొనర్చుచున్ భయో
త్పాదన మాచరించెడిని వానిని దుష్టము నీదు వేటలో
ఆదికిరాతుడీవొకడ వౌగద ! శ్రీగిరి మల్లికార్జునా !

వడిగల గుజ్జుముంబలెను ప్రవ్వడు చుండును ప్రాయ. మెప్పుడే
యెడల నొ ? కాలఘోర భుజగేంద్రము కాటిడవేచియుండు, నీ
యెడరుగ్రహించి తా మనుజుడెవ్వడు ? నీచరణాశ్రయుం డగుఁ
బడయునతండు నీవలనబ్రాపును శ్రీగిరి మల్లికార్జునా !

పాయని మాయనఁ దృతినిబద్ధ నరుల్ విడుపాటులేక మో
హాయుతులై కళత్ర తనయా త్తమతింజరియింత్రుగాని ని
న్నే యొక కొంచెమేని మదినెంచి భజించిన దీటు నంత్యమం
దా యమ ధర్మరాజు భయమంతయు శ్రీగిరి మల్లికార్జునా !

ఓడని శత్రుషట్కముల నూడని కర్మల బంధనంబులన్
వీడని యైహికభ్రమల వేయొనగూడని యింద్రియాళులం
గూడని దారులందుఁబడి కుందునెగాని నరుఁడొకింతయున్
వేడడు నిన్ను ముక్తినిడవే ! యని, శ్రీగిరి మల్లికార్జునా !

అమృతము మాని చేదుదినసైనటు నిన్ విడనాడి క్షుద్రదై
వతముల గొల్వనేమిటికి ? పాయకనమ్మిన నీదు పాదప
ద్మములనె నమ్మగావలయు మానక నమ్మిన వారికీవ మో
క్షమిడిన నీయగావలయుగా ! శివ శ్రీగిరి మల్లికార్జునా !

పత్రమొ ? పుష్పమో ? ఫలము ? పాయని భక్తిని నీకొసంగినం
బాత్రుని జేసి నీదయకు వానికొసంగెదవో ప్రభూ ! యిహా
ముత్రము లింతభక్తి సులభున్నిను గాదని క్షుద్రదేవతా
స్తోత్రము లేల ? చేయుమనుజుండిల శ్రీగిరి మల్లికార్జునా !

మూఁటినిరోసి యాజమిలి మూఁడిటినిం గడిగండకోసి ము
మ్మూఁటినిమూసి మూఁడిటికి మూలముసై వెలుగొందునిన్నిలం
బాటిలఁజూచి యోగిజనవర్యులు కర్మలు కాల ముక్తికిం
బాటలువేసికొందుర భవభంజన ! శ్రీగిరి మల్లికార్జునా !

కర్మము జన్మకుంగొలికికాగఁ బునఃపునరుద్భవోగ్ర దుః
ఖోర్మిపరంపరావ్యథల నొందుచు గుందును దేహియెప్పుడున్
కర్మ విముక్తి ముక్తియగుఁ గర్మల గాల్పగ నీదు భక్తినిన్
మర్మవిదుల్ గ్రహించెదరు మానక శ్రీగిరి మల్లికార్జునా !

నింగిని చుక్కలిన్నని గణించి వచింపగఁబూనినట్టు, ల
బ్ధింగొలపాతఁగొల్చినటు విశ్వధరిత్రిని రేణులెన్ని చె
ప్పంగ గడంగినట్టు లిలవాక్కుల కూహలకందనట్టి నీ
సంగతెఱింగి చెప్పుటకుఁజాలును శ్రీగిరి మల్లికార్జునా ?

నరులనునమ్మి యింతచెడి నాడనటంచనుకోగనేల ! యీ
శ్వరు నిను నమ్మినంజెడిన వాడును ధర్మమునమ్మిచెడ్డ వా
డరుగుదుగదయ్య ! నీ వొకడవాశ్రితకోటిని నింగివచ్చి మీ
దొరిగిన చేయియడ్డమిడి యోమెదు, శ్రీగిరి మల్లికార్జునా !

నీవు వినాశరణ్యమిక నిక్కముగా నితరంబులేదు న
న్నేవిధిగానొనర్చినను నీవయొనర్పుము ! నిన్ను నమ్మి నీ
సేవలు సేయువారెవరుఁ జెడ్డది లేదని విందునో జగ
జ్జీవన కారణా ! శ్రితవశీకర ! శ్రీగిరి మల్లికార్జునా !

నిన్ను మదీయభావమున నిచ్చలుభావన చేయుచు టి నో
పన్నగ రాజభూషణ ! ప్రపన్నుడనంటి శరణ్యమంటి న
చ్ఛిన్న భవవ్యథా వ్యథితచిత్తుని బ్రోవగఁజూడుమంటి నా
విన్నప మాలకింప గదవేప్రభు ! శ్రీగిరి మల్లికార్జునా !

చేతఁగలంబువట్టి కృతిసెప్పఁగడంగెడు నాకుఁగూర్పవే
ఆతతభావనాఝరి మహాభ్రధునీ సదృశంబుగాగ నా
కైతలుతెల్గుశారదకుఁగానకలుగాగ నొసంగి కొంచు నీ
ప్రీతికిఁబాత్రుడేనగుదు పెంపుగ శ్రీగిరి మల్లికార్జునా !

నీ కొఱకేను సత్కృతులు నిత్యము గూర్చెద చంపకోత్పల
శ్రీకమనీయ మాలలివి సిద్ధముసేసితి నూటయెన్మిదిన్
నా కవితాసమర్చకు మనంబున నేమియొసంగ నెంతువో
మాకిడవే యవారిగను మత్ప్రభు : శ్రీగిరి మల్లికార్జునా !

నీ కృపకంటె నేది వరణీయముురా శివ ! జన్మదుఃఖ దూ
రీకరణైక మార్గమొనరింపుము ! నీకొనరించు కావ్య సే
వాకలనంబిదెల్లఁ బరిపక్వము నొందగఁ గందు మోక్షల
క్ష్మీక సుఖైకభాగ్య సువిశేషము శ్రీగిరి మల్లికార్జునా !

నీకు నమస్కరింతు - కృపనిండిన చూపులఁజూచి లోకముల్
సాకుము ! సంపదల్గురిసి సాగగజేయుము ! విశ్వమంగళా
నీకము, వీగజేయుము ! వినిర్భర లోక తమ స్వమూహ మో
లోకశుభంకరా ! నిటలలోచన ! శ్రీగిరి మల్లికార్జునా !

అందును నిందు బోనిడక యాత్మను జ్ఞానులు మౌనులొక్క నీ
యందున నిల్పి కోటి కమలాప్తుల దీప్తులు కందళించు నీ
సుందర దివ్యరూపమును జూతురు లోపలి చూపులందు నా
కుందగు జూవు ! పాత్రతను గూరిచి శ్రీగిరి మల్లికార్జునా !

భమరికిఁగూర్చినాడ మధురంబుగఁబాడుకొనంగ వృత్తబం
ధములుగ మత్తకోకిలలు నవ్యముగా శతకంబు గూర్చి - ఆ
యమకవి నీకునీయవి సమర్పణముం బొనరించుచుంటి జ
న్మము సఫలంబు నొందగ నొనర్పుము ! శ్రీగిరి మల్లికార్జునా

ఒకరికి మత్తకోకిలలు - ఒక్కరి కుత్పల చంపకమ్ము లి
ట్లొకరికి నిచ్చి యాకొకరికి కుందగరాదని కూర్చినాడ మీ
రొకరిని మించి యొక్కరుగనోముచు నేనడు గంగనేలనో ?
సకల మొసంగరే ! ముదమెసంగగ శ్రీగిరి మల్లికార్జునా !

దేవల వంశసంభవుడు దేవలుడే యగు దాసుమయ్య పా
గావయనించి నీకునిడగా నిజరూపము సూపి యక్షయ
శ్రీవిభవంబులిచ్చితివి చేరినినున్ దరిసింపవచ్చు భ
క్తావళి కన్నదానమిడనాతడు, శ్రీగిరి మల్లికార్జునా !

దేవల వంశసంభవుడ దీనివయించితి దేవ దాసు పా
గా వలె నచ్చులల్లులను కమ్రముగానిడి పద్దు పేకలన్
దేవ ! త్వదంకితంబిది కృతింగొను మీయది సాహితీ ప్రతి
ష్ఠా విధిగా మదర్పితము జానగు శ్రీగిరి మల్లికార్జునా !

అల నెలరాజురేక సిగ యందున బూవుగనుంచి పెన్మెడిన్
మలచినయట్టి కెంజడల మాటున గంగను డాచి, నెమ్మెయిన్
వలిమలరాచపట్టి సగపాలయి యుండగ నాకు దోపవే !
చెలువుగ నందినెక్కి శశిశేఖర ! శ్రీగిరి మల్లికార్జునా !

వరము లొసంగవే ! తెలుగువారికి వాణికి మాన్యతా పుర
స్సరములు సంఘటింపవె ! ప్రజల్ రుజలేవి సుఖింపగా సుధల్
గురియుమె ! క్షేత్రి లక్ష్మి కొనగూర్చవె ! పచ్చని చీరసాలు లే
బరములు తూలగా సిరులువ్రాలగ శ్రీగిరి మల్లికార్జునా !

**సో**మకిరీట ! తన్మయత సొక్కుచు నాకవితావిపంచిపై
నీమహిమాదులన్గుణిచి నేర్చిన వట్టురచించి నృత్తము
ల్గా మెయిపుల్కరింత లెసగంగను బాడితిఁజిత్తగింపవే :
నామృదు కావ్యబంధకలనా విధి, శ్రీగిరి మల్లికార్జునా !

**ఘృ**ణులను బోని పద్యములు మాలగగ్రుచ్చితి నూటయెన్మిదిన్
ఫణులగు నాకు హారములు పద్యము తేలరయుంచుఁబల్క కా
ఫణుల ఫణామణీ ఘృణుల ప్రక్కన నీయవి వింతకాంతులం
గణనకునెక్క జానగునుకై కొను ! శ్రీగిరి మల్లికార్జునా !

**శే**షవిభూష ! నీదగువిశేషకృపా ప్రసరంబుచేతనే
భాషలదేవి నాకు వశపడ్డది తెల్గున కిన్ని చేసితిన్
భూషలుగాగ మత్కృతులు భూషగనీకిది యిచ్చినాడ నా
దోషములెన్నబోక కొను ధూర్జటి ! శ్రీగిరి మల్లికార్జునా !

**ఖ**లరిపు భంజనా ! సమధికంబగు భక్తిని మున్ను నీకు భ
క్తులు కవులెందఱో ? కృతులు గూర్చియుందురు వానినీవు కా
న్కలుగగ్రహించియుందు విది నా చిఱుకాన్కగ స్వీకరించి మి
క్కిలి గలిగింపు కావ్యపరకీర్తులు శ్రీగిరి మల్లికార్జునా !

రవిశశితారకంబుగను రమ్యమదీయ కృతప్రబంధ మీ
కవితను నీకు నంకితముగా నొనరించితి దీని నిల్పు కొ
మ్మవనిని శైవతత్త్వమెసలారెడు దానిని శాశ్వతంబుగా
శివకవి సమ్మతంబగుచు జెల్లును, శ్రీగిరి మల్లికార్జునా ।

కృతియిది సప్తసంతతులఁగీర్తికినాకృతి దిద్దునట్టిదై
క్షితిపయి నక్షతంబగుచుఁజెన్నలరారు - క్షరంబుగాని దు
న్నతముగ నక్షరంబయి తనర్చుట - అక్షరబద్ధమీకృతిం
గృతమతి నొచ్చుఁగాంతుఁగృతకృత్యత శ్రీగిరి మల్లికార్జునా !

తపమెఱుగన్ జపంబెఱుగ ధ్యానమెఱుంగ నెఱుంగమౌనమున్
విపులత మీర యోగముల బీగమెఱుంగఁ గవిత్వమొక్కటే
యిపుడిటులేనెఱింగినది యీ కవితాసముపాసనంబులో
నెవుడును నాదుపూజయిది యే ప్రభు ! శ్రీగిరి మల్లికార్జునా ।

మును సనకాదులైన మునిముఖ్యులు చూపులుగాని చూపులం
దనియగఁజూతురే పరమతత్త్వము నప్పరతత్త్వమైన నీ
కు నిదె యొసంగుచుంటిని త్రికూటము నందెసకొల్పి జోతినిం
బని పడి నీకుగూరిచి నివాళిని శ్రీగిరి మల్లికార్జునా !

